కలాభివర్ధన్యనుబంధము. ౧.



# గీత మంజరి

[ప్రథమ భాగము]



గ్రంథకర్త.

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి.

కలాభివర్ధన్యనుబంధము. ౧.



# గీతమంజరి.

[ప్రథమ భా



ఇది

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి ప్రణీతము.

మొదటి కూర్పు.

రాయవరము.

శ్రీ భారతీ తిలక ముద్రాక్షరశాలయందు

నల్లమిల్లి సత్తిరెడ్డి గారిచే ముద్రింపఁబడి

గ్రంథకర్త గారిచేఁ బ్రకటింపఁబడియె.

౧౯౧౩.

 [వెల రు ౦-౨-౦ లు.

# పీఠిక.



ఇంతవఱకు నాంధ్రుల కిట్టి గ్రంథము లపరిచితములు. ఇట్టి వాంగ్లేయ భాషా సంపర్కమువలన నాంధ్ర భాషా వధూటికి లభించిన నూతన నాలంకారములు. వివిధ విషయికము లగు నిట్టి గ్రంథములకుఁ బ్రచార మధికముగ నుండును. ఇప్పు డాంధ్ర దేశమున నవ శక్తి నలుగడల విజృంభించుచున్నది. కొలఁది కాలమున నీ నవశక్తి విజృంభణము వలన నాంధ్ర జాతి యౌన్నత్యము వహించుననుటకు సందియము లేదు. ఈ నవశక్తి యంగీకరింపకుండఁ బ్రజలలో విజృంభింపఁ జేయుట కమానుష ప్రజ్ఞావంతులగు కవుల కిట్టి నూతన గ్రంథములు సాధనములై యుపకరింపఁ గలవు. ప్రజలలో నీ నవశక్తి విజృంభింపఁ జేయుట యాంధ్ర నాయకుల విధి. ఈ నవశక్తిని విజృంభింపఁ జేయుట కనేక మార్గము లున్నవి. ఈ ప్రసంగమునఁ గవులు గూడఁ బ్రసక్తి గలిగించు కొనవలెను. ప్రకృ తాంధ్ర కవులు గూడ నీ విషయముగ శ్రద్ధ వహించి రేని నాంధ్ర జాతీయ నిర్మాణ

మతి సులభముగ నెఱవేఱఁ గలదు. ప్రకృతాంధ్ర కవుల కిది విధి. ఈ విషయము కవి గీతమునఁ దెలుపఁ బడినది. ఇదె తెలుపుటకే కవి గీత ముద్దేశింపఁ బడినది. ఈ నవ శక్తి విజృంభణమున కీ నా చిన్న గ్రంథ మెంత వఱకు నుపయోగించునో చెప్పఁ జాలను. ఈ చిన్న గ్రంథము వలన దేశమునకుఁ గాని భాషకుఁ గాని యేమైనఁ బ్రయోజనము గలిగినచో నీ గ్రంథ రచనకు నన్ను బ్రోత్సహించిన రాయవర గ్రామ వాసియగు శ్రీయుత మల్లిడి సత్తిరెడ్డికిని నాకును గల్గు నానందమునకు మేరయుండదు. ఈ గ్రంథమున కట్టి భాగ్యమే గలిగిన యెడలఁ దక్కిన యీ గ్రంథ భాగములను గూడ నప్పు డప్పు డొక్కొక్కటి చొప్పునఁ బ్రకటింపఁ గలను. ఈ గ్రంథ ప్రాశస్త్యాప్రాశస్త్యములను దెలియఁ గోరి నే నిప్పు డీ గ్రంథము నాంధ్ర నాయకులకు వందనములతో సమర్పించుచున్నాఁడను.

౧-౫-౧౩. } ఇట్లు,
పోలమూరు. } శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి.

# కృతజ్ఞత.



ప్రకృత మందాంధ్ర దేశము నం దెల్ల యెడల జాతీయోద్ధారణమునకుఁ బ్రబల ప్రయత్నములు జరుగుచున్నవి. తుద కీ యుద్యమ మెట్లు పరిణమించునో తెలియదు. దైవానుగ్రహము వలనను బాలకుల దయ వలనను శుభముగనే పరిణమింప వచ్చును. భావి కాలమున నీ యుద్యమ పరిణామ మెట్లయినను నిపుడు కొనసాగింపఁ బూనుట మన విధి. దీని కనేక మార్గము లున్నవి. అనేక సాధనము లున్నవి. ఇట్టి గ్రంథముల బ్రకటించుట వలనఁ గూడఁ బ్రయోజనము గలదు.

ఇట్లు భావించి మద్గురువర్యుల నిట్టి గ్రంథమును వ్రాయుఁడని కోర వల్లె యని యిది వ్రాసిరి.

తమ యనారోగ్యమును కరకు గొనక త్వరలో నీ గ్రంథమును వ్రాసి యిచ్చినందులకు మద్గురువర్యులను బ్రహ్మశ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారి కనేక కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాఁడను.

౧-౮-౧౩,<br>
రాయవరము. } మల్లిడి సత్తిరెడ్డి.



# విన్నపము.

మా యాంధ్ర సోదరులకు మా గ్రంథములపైఁ గల యాదరమునకు మే మనేక వందనము లర్పించుచున్నారము.

మా గ్రంథమాలా పంచమ కుసుమముగా "గుణ మంజరి" యను గ్రంథమును బ్రకటించు మని బ్రచురించితిమి గాని యది చిన్న గ్రంథ మగుటచే రాఁబోవు "మిత్రవానురాగ" మను నవలతో ననుబంధ గ్రంథముగాఁ బ్రకటించుటకు నిశ్చయించి యిప్పుడు మానితిమి. దానికి బదులుగా నిప్పుడు "గీత మంజరి" (ప్రథమ భాగము) యను నీ గ్రంథమును ననుబంధ గ్రంథముగాఁ జందాదారుల కుచితముగ నొసఁగుచున్నారము.

ఎప్పటి వలెనే మా గ్రంథమాలపై నభిమాన ముంచి తమ మిత్రులను జందాదారులుగాఁ జేర్చి మాకుఁ బ్రోత్సాహము గలిగింప మా చందాదారులను బ్రార్థించుచున్నారము.

౧-౫-౧౩.
రాయవరము.

ఇట్లు,
మల్లిడి సత్తిరెడ్డి,
వ్యవస్థాపకుఁడు.

# విషయ సూచిక.

విషయము. పుట.

# ప్రకటన.



**వారకాంత.** (నాటకము.) ౦-౪-౦

వేశ్యల మాయ లిందు చక్కఁగ వర్ణింపఁబడినవి.

**రామదేవవిజయము.** ౦-౬-౦

ఇది నాటకము. రెడ్లకును, రాజులకును యుద్ధము. చదివితీరవలెను.

**సాహసిక రాజపుత్త్రిము.** ౦-౬-౦

ఇది నాటకము. ఉదయపుర రాణావారికిని అక్బరునకును యుద్ధము

**పాణిగృహీతాశ్రవణానందశృంఖల** ౦-౬-౦

తిరుపతి వేంకట కవుల పాణిగృహీతకును శ్రవణానందమునకును విమర్శ గ్రంథము.

**గీతమంజరి.** ౦-౨-౦

దేశాభిమానమును గలిగించు చక్కని గ్రంథము.

వలయువారు:— మానేజరు, కలాభివర్ధని,
రాయవరము, కోట రామచంద్రపురం పోష్టు,
గోదావరి జిల్లా. (అని వ్రాయవలెను)



శ్రీ ర స్తు.

# గీ త మం జ రి.

ప్రథమభాగము.



## ప్రార్థనా గీతము.



గీ॥ శ్లో॥ నుంటి నీ వంచుఁ ♦ గొంద ఱంద్రు
అంతటను నుంటి వని కొంద ♦ ఱాడు చుంద్రు
అంతటను నుంటివో గుళ్ల ♦ యందె గలవొ
ఎందయిన నేమి? కలవందు ♦ నేను దేవ!
కొంద ఱంద్రు బహిః పూజ ♦ గొప్ప దంచు
మఱియుఁ గొందఱు ఘన మంద్రు ♦ మానసికము
అదె ఘనమొ చర్చ సేయుఁగ ♦ నిదియె ఘనమొ
కాని నీ పూజ మాత్రము ♦ ఘనము దేవ!
నిరుపహతమై చెలంగు నీ ♦ కరుణఁ గోరి
చిత్త మప్పంగ నిన్ను బూ ♦ జించు చుంటి

నిన్ను నమ్మితి ; నీగుణా ♦ నీకములను ను
తించు చుంటిని; నిన్నుభా ♦ వించు చుంటి;
మానసమ్మున నిన్నుపృ ♦ మఱవ లేను
ఒరుల నే నెప్పుడును నమ్మి ♦ యుండ లేను
వారి ప్రేమానురాగముల్ ♦ గోర లేదు
వారి కవి యించుకయు భయం ♦ పడఁగ లేను
శిక్షఁ జేసిన రక్షణఁ ♦ జేసినను ని.
జమ్మ నమ్మము సీదె భా ♦ రమ్ము దేవ;
మోక్ష మిమ్మని నిన్గోర ♦ బుద్ధి లేదు
దాని వాంఛించుటకు నిది ♦ తఱియుఁ గాదు
సంపదను గోర నాకు ని ♦ ష్టమ్ము లేదు
రహిఁ బ్రయత్నించు నెడ నది ♦ రాక పోదు
మహిత బిరుదంబు లందన ♦ మ్మతము లేదు
అట్టు లందుట జన్మంపు ♦ టవధి గాదు
ఏమి నా చేతఁ జేయఁగ ♦ నెంచి నావో
ఆ విధిని నే నెఱుంగక ♦ పోవ లేను
చిత్తమం దెంతయును నంత ♦ సించు చుంటిఁ
దాళ్మి నా విధి సేయు సి ♦ ద్ధముగ నుంటి

నా కలమ్మునకును జీవ ♦ న మ్మొసంగి
నాదు హృదయమ్మునకు స్వాతం ♦ త్రత నొసంగి
సరళ సముదార భావనా ♦ శక్తి నొసఁగి
రమ్య గంభీర మృదు వచో ♦ రచన లొసఁగి
ఆ విధి నొనర్చు పట్టున ♦ నభినివేశ
మతి మన స్థైర్య మత్యంత ♦ మైన పోగు
పమ్ము ధైర్యమ్ము తఱుఁగని ♦ శక్తి యుక్తి
దూర దృష్టియు సదసద్వి ♦ చారణమ్ము
అలఘుతర కష్ట సహనమ్ము ♦ ఫలము నొసఁగి
కరుణ మీఱఁగఁ బ్రోవుమా ♦ పరమ పురుష!



శ్రీ ర స్తు.

# గీత మంజరి.

[ ప్రథమభాగము. ]

---

## లేఖినీ గీతము

---

కావ్య నిష్పత్తి యగును వా ♦ క్యమ్ము వలన
వాక్య నిష్పత్తి యగును శ ♦ బ్దమ్ము వలన
శబ్ద నిష్పత్తి యగును న ♦ క్షరము వలన
నక్షరోత్పత్తి నీ వల్ల ♦ నగును గలమ!.
నిఖిల మైనట్టి విశ్వంబు ♦ నిలిచి యుండ
నా పరబ్రహ్మ మాధార ♦ మైన యట్లు
అమృత నిధి తుల్య మగు వాఙ్మ ♦ య ప్రపంచ
మెల్ల నిలువఁగ నాధార ♦ మీవు కలమ!.
ప్రజలఁ బాలించు నల సార్వ ♦ భౌమునకును
విశ్వ భూషణ మగు బుధ ♦ బృందమునకు

రహస్య గుణ సాంద్రుఁ డగు కవి ♦ రాజు నకును
వారు వీ రని వేర్వేఱఁ ♦ బల్క నేల?
యేరు లౌకిక వృత్తమ్ము ♦ నెఱుఁగు వారొ
యేరు నాగరికులొ వార ♦ లెల్లఱకును
నీవు లేకున్న మతిపోవు ♦ నిశ్చయముగ
నిక్కముగ సర్వ ధర్మములు ♦ నియతిఁ దప్పి
నిముసమున లోక వృత్తంబె ♦ నిలిచిపోవు.
కలమ! నీ కిది తెలిసినఁ ♦ దెలియకున్నఁ
జాఁగు! నీ చర్య మాత్ర మా ♦ శ్చర్య కరము
నీ ప్రభావం బనంతంబు ♦ నిస్తులంబు
నీ స్వభావంబు మృదులంబు ♦ నిర్మలంబు
నీదు గమనంబు లలితంబు ♦ నిరుపమంబు
నీ యదృష్టం బఖండంబు ♦ నిరుప హతము
నీ మహా మహిమము సర్వ ♦ తోముఖంబు
నీదు వృత్తంబు సంస్తవ ♦ నీయ మెన్న
లేఖినీ! నీకుఁ దుల్యంబు ♦ లేదు జగతి.
ప్రతిహతము కాని భావనా ♦ బలము కలిమి
సకల లౌకిక వృత్తముల్ ♦ సంగ్రహించి

వర్ణనీయంబులైన క ♦ ల్పనలఁ జేసి
అమృత సారమ్ములైన వా ♦ క్యములఁగూర్చి
కంబు సంకాశ గంభీర ♦ కంఠ మెత్తి
పరభృతము పోల్కె మృదువుగాఁ ♦ బాడి పాడి
వీనులకు విందొదవు నట్లు ♦ వినిచి వినిచి
స్వాంతముఁ గరంచి తన్మయ ♦ త్వమ్ము గొల్పి
మనుజవర్యులఁ గీలు బొ ♦ మ్మలుగఁ జేసి
కపట నాటక మాడించి ♦ కరము మెఱసి
చెలఁగి విధి సృష్టి తలక్రిందు ♦ సేయునట్టి
కవివరేణ్యుని చేతి ఖ ♦ డ్గంబ వీవు
కలమ! నీ భాగ్యమెన్న న ♦ య్యలకుఁ దర మె?,
ఆతత రాజ్ఞాన తిమిర కం ♦ జాప్తుఁ డగుచుఁ
వెలుఁగు కవి సార్వభౌముని ♦ చేతి కెక్కి,
తళ్కు గల మల్లె పూవుల ♦ దండ పగిది,
సానఁ బట్టిన పవడాల ♦ సరము కరణిఁ,
గోమరు మీఱెడి ముత్యాల ♦ కోవ తేవ,
మంజుల మ్మగు రత్నాల ♦ మాల పోల్కె,
సౌరు గల కట్ట కాసుల ♦ పేర్మి తీరు,

ముద్దు లొల్కెడు గతి మనో ♦ మోహముగఁ.
చంద్రికా వ్యాప్త ముకురంబు ♦ సరణి వెలుఁగు
ధవళ పత్త్రమ్ము మీఁద ను ♦ త్సవము మీఱఁ
గ్రమను నక్షరమాలికఁ ♦ గూర్చు కొంచుఁ
గొంకొకింతయు లేక ని ♦ రంకుశ గతిఁ
బఱగువారుచు నీవు క ♦ న్పఱచు నట్టి
అహ్లాదనంబుఁ గొనియాడ ♦ నెవ్వఁడోపు ?.
పరమధర్మజ్ఞుఁ డగు న్యాయ ♦ వాది కంటె
నీతి కోవిదుఁ డైన మం ♦ త్రివరు కంటె
వసుధఁ బాలించు ఘన చక్ర ♦ వర్తి కంటె
సర్వ జన పూజ్యుఁ డగు బుధే ♦ శ్వరుని కంటె
ముజ్జగమ్ములఁ దుల లేని ♦ ముగ్ధ కంటెఁ
బల్కు ముల్కుల గెలు పొందు ♦ ప్రౌఢ కంటె
తన్త్ర రమణు ప్రాణ మగు గూఢ ♦ చారు కంటెఁ
గరము గంభీర హృదయుఁడౌ ♦ కవి వరేణ్యు
నంతగంగంబు గ్రహియించి ♦ యబ్బురముగ
నేమియు నెఱుఁగ నట్లుండి ♦ యింతలోన
సకల జనులకుఁ బ్రౌఢిమైఁ ♦ జాటి చెప్పఁ

గలదు! నీ కున్న శ క్తి య ♦ న్యులకుఁ గలదె?.
ఆరయఁగ నీ స్వరూపంబు ♦ దారు మయము
ఒప్పు లోలికెదు నీ మోహ ♦ యో మయంబు
చెన్నిక త్తియ నీకు మ ♦ షీ జలంబు
అట్టి నీకెట్టు లీ శ క్తి ♦ యబ్బె నదియొ
మించు కృప నీశ్వరుఁడె ప్రసా ♦ దించి నాఁడొ
కవి కర స్థితియే ముఖ్య ♦ కారణంబొ
అదియుఁ గాక మ జే హేతు ♦ వైనఁ గలదొ
భళిర! ప్రకృతి రహస్యంబు ♦ తెలియకుండె
మాకుఁ దెలియఁగ బోధింపు ♦ మా! కలంబ!
కళలు దేరుచు నమృత సం ♦ కాశ మగుచు
నలరు మా కవితా రసా ♦ యన మొసంగి
సకల జనులను సంతోష ♦ సాగరమున
నోల లాడింప భావించి ♦ యుంటి మిపుడు.
వెలయు మా యాంతరంగిక ♦ వృత్తిఁ దెలిసి
టొం కొకింతయు లేక ని ♦ రంకుశ గతిఁ
గవివరుల్ గొనియాడఁ బొం ♦ కమ్ము మీఁదఁ
దళ్కు టొలయఁగ వెలయు ప ♦ త్రమ్ము మీఁద

సలలితాక్షర రత్నముల్ ♦ జల్లి కొనుచు
నసదృశంబైన మా హృద ♦ యమ్ము వెంటఁ
లేఖినీ! పర్వు లెత్తుము ♦ లీల మెఱసి.
కమల! మా యిష్టమును దీర్పఁ గలిగి తేని
స్వాంత మందున నిన్ను బ్రే ♦ మింతు మెంతో
నీ ప్రభావమ్ము వెలుఁగ ద ♦ ర్శింతు మెపుడు
పూలఁ బూజించు చుందు మా ♦ మోద గరిమ
నీ యశం బెల్ల దిక్కుల ♦ నింతు మేము.



శ్రీరస్తు.

# గీతమంజరి.

[ప్రథమభాగము]

## కవి గీతము.

తోడి బాలురతో నాట ♦ లాడు నప్పుడె
చిల్క వలెఁ దొక్కు పల్కులు ♦ పల్కు నప్పుడె
కాకపక్షమ్ము శిరమునఁ ♦ గ్రాలు నప్పుడె
నియతిమై నోనమాలను ♦ నేర్చు నప్పుడె
ముద్దు గజ్జెలు గల్లల ♦ మ్రోయు నప్పుడె
చందురుం దెచ్చి యిమ్మని ♦ కుందు నప్పుడె
బూచి యని నంత వెఱఁగంది ♦ పోవు నప్పుడె
అమ్మతోఁ బ్రీతి దోబూచు ♦ లాడు నప్పుడె
దిన్న మొలతోడ సతతంబు ♦ దిరుగు నప్పుడె
కలికి జోలల విని నిద్రఁ ♦ గాంచు నప్పుడె
జనని తిన్పింపఁగా బువ్వఁ ♦ దినెడు నప్పుడె
వేడ్కమై నవ్వ దరి కథల్ ♦ వినెడు నప్పుడె
తివిరి ముది తాత నటు నిటు ♦ ద్రిప్పు నప్పుడె
మనసు లోక వృత్తములకు ♦ మరగ నప్పుడె

క్రాలు నూనూఁగు మీసలు ♦ రాని యప్పుడె
యౌవనము రాక ముందె బా ♦ ల్యంబు నందె
తనకుఁ దా నయి యీ కవి ♦ తా లతాంగి
అవని నీ యందు నితరుల ♦ యందుఁ గంటె
నే ఘనతఁ గాంచి నిన్ను మో ♦ హించి నన్నొ
మాకు రవ్వంత వివరింపు ♦ మా కవీంద్ర!
ఎంత యక్కఱ తోడ మ ♦ రెంత ప్రేమ
తోడ నెంతటి రాగమ్ము ♦ తోడ నెంత
ముదముతో నిన్ను మోహించి ♦ నదియొ గాని
యేమి సుఖ మొందు చున్నదో ♦ యేమొ గాని
యెంత సుఖ మందు చున్నదో ♦ యేమొ గాని
ఎలమి ని న్నామె వలచుట ♦ వలన నీకు
మనము వికసించె నూత్న భా ♦ వనలు పొడమె
ధిషణ యత్యధికంబుగఁ ♦ దీక్ష్ణ మయ్యె
సరళ సముదార ధారణా ♦ శక్తి కలిగె
మంచి చెడ్డల నెఱుఁగు సా ♦ మర్థ్య మబ్బె
స్వత్వ మైన పరేంగిత ♦ జ్ఞాన మడరె
సమధి కాద్భుత కల్పనా ♦ శక్తి పుట్టె

నతుల మగు వర్ణనా విశి ♦ ష్టత జనించెఁ
దన్మయత్వమ్ము గొల్పు వా ♦ గ్ధార యొదవెఁ
బరుల వశ వర్తులుగఁ జేయు ♦ పథము తెలిసె
దీటు లేని గభీర వ ♦ క్తృత్వ మబ్బె
సమయ సముచిత భాషణ ♦ శక్తి కలిగెఁ
బరుల గెల్వఁగఁ దగు యుక్తి ♦ బలము పొడమెఁ
దెల్లముగ లోక వృత్తమ్ము ♦ తెలియ నయ్యె
నవని జతలేని రాజ పూ ♦ జ్యత ఘటిల్లె
వెలయ నీ జన్మ మెంతో ప ♦ విత్రమయ్యె
నాననం బిందిరా వాస ♦ మై చెలంగు
పంకజము పోలె నూతన ♦ ప్రభ వహించె
భాగ్య దేవత నీ ఫాల ♦ ఫలక మందుఁ
జిత్త ముప్పొంగ నృత్యంబు ♦ సేయు చుండె
నఖిల మానవ హార్దదా ♦ యకత యబ్బె
నతుల మగు జగ దాదర్శ ♦ కత లభించెఁ
గపట నాటక మాడింపఁ ♦ గలిగె శక్తి.
అది కలిగె నిది కల్గె నం ♦ చనఁగ నేల?
యెన్ని శక్తులు గలవో య ♦ వెల్లఁ గలిగెఁ

జిత్రమగ నీదు జీవ చ ♦ రిత్ర మెల్ల
మహిత గతి నొక్క మాఱుగా ♦ మాఱి పోయె.
ఔర కవివర్య! కవితా ల ♦ తాంగి తోడ
నెట్లు తెఱఁ బుచ్చు చుంటివో ♦ యేమొ గాని
యెంత సుఖ పెట్టు చుంటివో ♦ యేమొ గాని
పరులతో మాటలాడెదు ♦ పట్టు లందు
సకియతో ముచ్చ టాడెదు ♦ సమయ మందు
లీల వనమున విహరించు ♦ వేళ యందు
చిత్త ముప్పొంగ స్నానమ్ము ♦ సేయు నపుడు
చెలియతోఁ గూరుచుండి భు ♦ జించు నపుడు
అనుఁగు బిడ్డలఁ బ్రీతి ము ♦ ద్దాడు నపుడు
పరిషదంబుల నున్నట్టి ♦ పట్టు లందు
శాస్త్ర చర్చలఁ గావించు ♦ సమయ మందు
సకల సాంసారికపుఁ బనుల్ ♦ సలుపు నపుడు
ఒరులఁ జూడఁగఁ దఱి వేచి ♦ యున్న యపుడు
చెలులతోఁ గష్ట సుఖములఁ ♦ దెలుపు నపుడు
లాభ నష్టంబు తెలియఁగఁ ద ♦ లంచు నపుడు
మంచి సెబ్బరలన్ను విచా ♦ రించు నపుడు

చేయఁ దగు నేది యంచు యో ♦ చించు నపుడు
వేడ్క గుఱ్ఱముపై స్వారి ♦ నాడలు నపుడు
ఉత్సవము మీఱ నుయ్యేల ♦ లూఁగు నపుడు
పులుల వేఁటాడఁ గోనకుఁ ♦ బోవు నపుడు
చెలఁగి నౌకా విహారమ్ము ♦ సేయు నపుడు
కలికి తరఁగలఁ గని రహిఁ ♦ గాంచు నపుడు
మృదుల గీతమ్ము నాలించి ♦ మెచ్చు నపుడు
శిష్యులకుఁ బ్రీతిఁ బాఠముల్ ♦ సెప్పు నపుడు
దేవ దేవుని భక్తిఁ బ్రా ♦ ర్థించు నపుడు
నవ్వ నప్పుడు విను నప్డు ♦ నడచు నపుడు
అప్పు డిప్పు డంచు నిఁక నిట్లు ♦ చెప్ప నేల?
సర్వ కాలమ్ము లందు స్వ ♦ చ్ఛంద వృత్తి
నాత్మ నొక్కింతకయు సంశ ♦ యమ్ము లేక
విధియును విరామము లేక ♦ విసుగు లేక
ఊరు రహస్యమ్ముగా ముద్దు ♦ లొలుకు నట్లు
ఎలమిఁ జెవిఁ జెప్పుచు నె యుండు ♦ నేమొ గాని
కనఁగ నందే విశేషమ్ము ♦ గలదొ యేమొ
మానఁ దగిన రహస్యమ్ము ♦ లేన్ని యెడల.

మాకు రవ్వంత వచియింతు ♦ వే కవీంద్ర!.
ఎప్పుడు నీ పల్కులను విన్న ♦ నేమొగాని
బహుళ గంభీరమై యని ♦ ర్వర్ణనీయ
మై మధురమై వినూత్నమై ♦ కోమలంబు
నై కరము విస్మయప్రదం ♦ బై మనోహ
రంబునై చెల్లు రహస్య భా ♦ వం బొకండు
జలద శకలాంతరిత శర ♦ చ్చంద్రిక వలెఁ
గల్గి పసిబిడ్డ నను దొక్కు ♦ పల్కు పోల్కి
శ్రావ్యతమమైన మణిత ని ♦ స్వనము కరణి
బహుళ కోమల వీణా ర ♦ వమ్ము పగిది
ముద్దు లొలుకుచు నస్పష్ట ♦ ముగ స్ఫురించి
మించి మము మోహవార్ధిఁ దే ♦ లించు చుండుఁ
గారణం బేమొ తెల్లంబు ♦ గాదు మాకు
నలరుమై నీవు కవితా ల ♦ తాంగి తోడ
నాడు పల్కులు గావు గ ♦ దయ్య యవ్వి?
అవియొ కావో యెఱుంగమే ♦ మైన నేమి?
నీదు పల్కుల నాలించి ♦ నిఖిల జనులు
భావము గరంగఁ దన్మయ ♦ త్వమ్ము గాంచి

మహినిఁ జరియించు కీలు బొ ♦ మ్మలుగ మాని
ఆత్మ నీకయఁ గోరి ని ♦ న్నాశ్రయించి
ఓర్పుమై నీముడలఁ దీర్చు ♦ చున్న వారు
వారు నిన్నింక గడెయైన ♦ వదల లేరు
వారిచేఁ గాని యట్టిదే ♦ పనియు లేదు
వారి నెల్లఱ నడపించు ♦ వంతు నీది;
లేనికథ నొక్క దానిఁ గ ♦ ల్పించిగాని
భాసుర పురాణ గాథను ♦ దీసిగాని
గురుతరంబుగఁ బై మెఱుం ♦ గులను గూర్చి
అరయ నాపాలి మధురమా ♦ నట్టి రీతి
గ్రంథమును వ్రాయు నిది తఱి ♦ గాదు నీకు;
నీ విపుడు సేయ వలసిన ♦ దెంతొ గలదు
ఆంధ్ర రంగస్థలమున ని ♦ ప్డన్ని యెడలఁ
ప్రబలతరమైన చలన మా ♦ రంభమయ్యె
నాంధ్ర వీరుల హృదయంబు ♦ లందు నిప్డు
నిరుపహత మాతృభక్తి జ ♦ నింప వలయు
నిస్తుల సహోదర ప్రేమ ♦ నిగడ వలయు
నాత్మ గౌరవ విజ్ఞాన ♦ మబ్బ వలయు

ఘనతర స్వాభిమానమ్ము♦గలుగ వలయు
నుద్ధురపు నెంత నోత్సాహ♦మొదవ వలయుఁ
బుడమి జతలేని శౌర్యమ్ము♦వొడమ వలయు
నతితరమ్ముగ సాహస♦మడర వలయు
నధిక నిర్భయ వృత్తి రూ♦పంద వలయు
నెంతయేనియు గాంభీర్య♦మెసయ వలయు
ఘనత రాభిని వేశమ్ము♦గలుగ వలయు
నసమమైనట్టి యౌదార్య♦మెసఁగ వలయు
నిర్మల ప్రభు భక్తి జ♦నింప వలయు
నదియు నిది గల్ల వలె నంచు♦ననఁగ నేల?
ఆంధ్రులకు నన్ని శక్తులు♦నబ్బ వలయు
నాంధ్ర జాతీయ నిర్మాణ♦మమర వలయు
నాంధ్రులు మహోన్నత స్థితి♦నంద వలయు
నట్టి గ్రంథమ్ము వ్రాసిన♦నిది ఘటిల్లు
నట్టి గ్రంథమ్ము వ్రాయఁగా♦నగుఁ గవీంద్ర!
సత్యముగ నిప్డు నీ విధి♦కృత్య మిదియ
అరయ నిర్దుష్ట మగు నుపా♦యమ్ము నిదియ
భద్రములఁ గూర్చునట్టి స♦త్పథము నిదియ

కార్యసాధక మగు నుప ♦ కరణ మిదియ
యింద్రజాలిని వెల్గించు ♦ నదియు నిదియ
త్వరగ నీ విధి నెఱవేర్ప ♦ దలఁప వేల?
సాగ దేమో యటంచును ♦ జంకనిందు
నారయఁగఁ గష్టమావంత ♦ యైన లేదు
అపరిచిత విషయంబిది ♦ యనుట కేని
నిజ్జగతి నీకుఁ దెలియని ♦ దేమి గలదు?
లాభనష్టమ్ము లెన్నఁ ద ♦ లంచె దేని
నిందుఁగల యట్టి లాభమిం ♦ కెందు లేదు
ఆదరము గల్గునో లేదో ♦ యందు వేనిఁ
జెలఁగి నిన్భక్తిఁ బూలఁ బూ ♦ జింత్రు ప్రజలు
అరయనిది మంచిదో కాదో ♦ యందు వేని
నింతకంటెను మంచిదిం ♦ కెదియు లేదు
ఇదిగొ నర్చిన నీకీర్తి ♦ వృద్ధియగును
బరగ నీ జీవితమ్ము పా ♦ వనతఁగాంచుఁ
గాలము గళించుచున్నది ♦ కాంచెదేల?
కవివరా! నిర్భయమ్ముగఁ ♦ గడఁగు మయ్య!.

---

శ్రీ ర స్తు.

# గీత మంజరి.

[ ప్రథమభాగము. ]

---

## ప్రబోధ గీతము.

---

గాఢ తిమిరోపహత నిశ ♦ కడచి పోయెఁ
గుక్కుట రుతమ్ము దిక్కులఁ ♦ బిక్కటిల్లె
శారి కాస్పష్ట గీత ని ♦ స్వనము లెసఁగెఁ
గలికి బంభర ఝుంకార ♦ ములు సెలంగె
బహుళ మంజుల కీరార ♦ వమ్ము లొలసె
బావురమ్ముల కువ కువ ♦ ధ్వనులు దనరెఁ
బరుషతర వాయస ప్రలా ♦ పమ్ము లడరె
నరుణ కాంతులు ప్రాగ్దిశ ♦ విఱియఁ బాఱె
ముమ్మురమ్ముగ ఝుంఝాని ♦ లమ్ము వీచె

సమలమగు నాంధ్ర దేశపు♦టాకసమున
బలిసియుండిన మేఘముల్♦తొలఁగఁ జొచ్చె
జ్ఞాన మార్తాండ కిరణప్ర♦సార మయ్యెఁ
బ్రకృతి కామిని నూతన♦ప్రభ వహించెఁ
డగదు నీ కిఁక నిటు నిద్రఁ♦దవిలి యుంట
మేలుకొను మాంధ్ర వీరుఁడ! ♦ మేలుకొనుము.
తిరముగాఁ గాల చక్రమ్ము♦తిరిగి పోయె
మహితమగు లోక వృత్తంబు♦మారి పోయెఁ
బ్రకృతి పరిణామ గతియు వి♦స్పష్టమయ్యె
నంతట ననంత నవశక్తి♦యంకురించెఁ
బ్రథిత సముదార సద్భా♦వనలు వొడమె
ధరణిఁ బొడసూపె నూతనా♦దర్శచయము
స్వ పర భేద విచారణా♦శక్తి వొడమె
న్నవ్య జాతీయ గౌరవ♦జ్ఞాన మెసఁగె
విమలతర మైన స్వాభిమా♦నము జనించె
నున్నతోచిత తృష్ణలు♦నుద్భవించెఁ
బుధవశీకార ప్రభావమ్ము♦నెఱుఁగఁ బడియె
సమధికంబుగ నూత నో♦త్సాహ మడరె

నాంధ్ర రంగస్థలమ్ము నం♦దన్ని యెడలఁ
బ్రబలతర మైన చలన మా♦రంభమయ్యెఁ
దగదు నీ కిఁక నిటు నిద్రఁ♦దవిలి యుంట
మేలుకొను మాంధ్ర వీరుఁడ! ♦ మేలుకొనుము.
వంగ దేశీయు ముఖ్యులై న♦భ్రాతృవరులు
ప్రకట తరముగ సమయ శాం♦తికుఁడు సేయు
నాయుష: కీర్తనంబును♦నాలకించి
గాఢతమ నిద్రనుండి మే♦ల్కాంచి మించి
అనుపమం బైన విజ్ఞాన♦ధనము వడసి
ధరణిఁ దుల లేని తమ నీచ♦దశకు రోసి
మహితమై యొప్పు ప్రకృతి ధ♦ర్మము గ్రహించి
ప్రవిమలం బైన యాత్మ గౌ♦రవ మెఱింగి
గెలిచి తీరెదమని పట్టు♦దల వహించి
ఈశ్వరుని మీఁదఁ దమ భార♦మెల్ల నునిచి
ఓర్పుమై నెల్ల యిక్కట్టు♦లోగి సహించి
సాహసంబూని నూత నో♦త్సాహ మొంది.
మొనసి జాతీయ పరమావ♦ధిని ముదమ్ము
మీఱఁగాఁ జేర్పఁ బోవు చు♦న్నారలదిగో!

తగదు నీ కిఁక నిటు నిద్రఁ దవిలి యుంట
మేలుకొను మహాంధ్ర వీరుఁడ! మేలుకొనుము,
పరుల యున్నతిఁ గనలేని యరవ వార
లాంధ్ర దేశపు సంపద లనుభవింప
మఱఁగి, భ్రాతృ భావమ్ము నెమ్మదిని మఱచి
ప్రబలమగు నీదు సాత్త్వికత్వమ్ముఁ జూచి
గురుతరమ్మైన నీదు లోకువ గ్రహించి
ప్రథిత మైనట్టి నీ ప్రభావమ్ము మఱచి
అనుపమమ్మగు నీదు శౌర్యమ్ము మఱచి
విస్మయము గొల్పు నీ శక్తి విస్మరించి
మనము నం దీవు మూర్ఖుఁడ వని తలంచి
ముష్కరం బైన కౌటిల్యమును వహించి
ఏము నీ దాసుల మటంచు నే వెలు చెప్పి
అవని నసహాయ శూరుఁడ వని నుతించి
నిన్ను నయమున జోకొట్టి నిద్ర పుచ్చి
వెక్కిరించుచు నున్నారు వేవిధములఁ
దగదు నీ కిఁక నిటు నిద్రఁ దవిలి యుంట
మేలుకొను మహాంధ్ర వీరుఁడ! మేలుకొనుము,

అరవ వారట్లు లుండ నీ♦యాంధ్ర దేశ
సోదరులు కొందఱు వివేక♦శూన్యు లగుచు
విపుల చారిత్రిక జ్ఞాన♦విముఖు లగుచు
స్వీయ శక్తి నెఱుంగక♦భీరు లగుచు
అన్యులు హాసింతురని తెలి♦యంగ లేక
ఆత్మ విద్రోహ మని సంశ♦యంబు లేక
మంచి చెడ్డల యోచింప♦నెంచఁ బోక
కష్ట సుఖములఁ జర్చింపఁ♦గడఁగఁ బోక
లాభ నష్టమ్ము లెఱుఁగఁ ద♦లంపఁబోక
అధిపు నాశయమును దెలి♦యంగ లేక
ప్రకృతి పరిణామమును గ్రహిం♦పఁగను లేక
నిర్మ లాత్మ గౌరవమును♦నీటఁగలిపి
మహిత జాతీయ ఘనతను♦మంటఁ గలిపి
కడఁగి పూర్వుల సత్కీర్తి♦గంగఁ గలిపి
అపయశము గట్టు నని భ♦యంబు విడిచి
అరవ వారల పాదమ్ము♦లాశ్రయించి
ఆంధ్ర రాష్ట్రోద్యమంబు గ♦ర్హ్యం బటంచు
మేఱమీఱ హాస్యించు చు♦న్నార లకట!

తగదు నీ కిఁక నిట్టు నిద్రఁ దవిలి యుంట
మేలుకొను మాంధ్ర వీరుఁడ! మేలుకొనుము.
ప్రకృత కాలంబు సుంతైన బాగు లేదు
ప్రబలి సోద్రేకులగు గ్రామ్యవాదు లొకట
సారమతులగు తన్నిరాసకులు నొకట
సంఘమును దిద్దఁ బూను సంస్కర్త లొకట
వారి నెదిరించు ప్రతికూలవాదు లొకట
నాంధ్ర రాష్ట్రోద్యమము సేయు వనఘు లొకట
వల దనుచుఁ బల్కు ప్రతికూలవాదు లొకట
స్వార్థ దూషితులైన పామరుల చెంతఁ
జెలఁగి తమ తమ పక్షముల్ నిలిపి కొనఁగ
వెనుక దీయక సేయు వాదనల వలనఁ
దాస్యమోఁ జేయుచున్న యత్నముల వలన
స్థిరతఁ గోల్పోయి నీ మాతృదేశ మిపుడు
ప్రఖిల మంకర ఘూర్ణిత వార్ధి వోలె
నల్లకల్లోలమై యున్న దక్కటకట!
నవనవోద్భూతమైన యాశా నవ్యశక్తి
ఉద్ధురంబైన యీ మాతనోద్యమంబు

ఏఱు పరిణమించునో యేరి ♦ కెఱుఁగ రాదు
పూతమై దివ్యమైన నీ ♦ మాతృ దేశ
మిట్టి సందిగ్ధ సమయమ్ము ♦ నెఱుఁగ జెప్పు
కోరి నీ విప్పు డిది పూను ♦ కొనక యున్నఁ
జవిరి యెవ రీ సమస్యలు ♦ దీర్చువారు?
ఎవ్వ రీ కష్ట వారాశి ♦ నీఁగు వారు?
ఎవ్వ రీ యుగ్యమంబు వ ♦ హించు వారు?
తెగదు నీ కింక నిటు నిద్రఁ ♦ దవిలి యుంట
మేలుకొను మాంధ్ర వీరుఁడ! ♦ మేలుకొనుము.
నీ మతంబు పవిత్ర హిం ♦ దూ మతంబు
అనఘ భారత మాత నీ ♦ యనుఁగు మాత
మధురమగు నాంధ్ర భాష నీ ♦ మాతృ భాష
గౌతమీ కృష్ణ వేణ్యాది ♦ ఘన నదీ ప్ర
వాహ వర్ధిత దివ్య సం ♦ పత్ప్రదంబు
సకల సౌఖ్యకరంబు నీ ♦ జన్మ భూమి
అరయ నీ జాతి వీరవ ♦ ర్యాశ్రయంబు
నీమ సంఘంబు విమలంబు ♦ నిరుపమంబు
నీ ప్రకాశం బసాలెంబు ♦ నిరుపహతము

అలఁగు నీ శౌర్య వహ్ని ని♦రంకుశంబు
అనఁగ నెంతును నీ కత్తి♦కడ్డు లేదు
నీ బలం బెన్న నత్యంత♦తీక్షణంబు
నీ హృదయ వృత్తి యెంతయు♦నిర్మలంబు
అరయ నీ కొక్క లోటు లే♦దైనఁ గాని
ఎన్ని భాగ్యంబు లుండిన♦నేమి వాసి?
నింద్య మైనట్టి యీ గాఢ♦నిద్ర వలనఁ
బ్రథిత జాతీయ ఘనత వి♦ధ్వంస మయ్యె.
నా యసమ శౌర్య వహ్ని చ♦ల్లారి పోయె
విమల మా వీర రక్తంబు♦విఱిగి పోయె
నుద్ది లేనట్టి యా బుద్ధి♦మొద్దు బాఱెఁ
జెలఁగు నా మానసికవృత్తి♦కలఁగి పోయె
నవ్వువారికి సందయ్యె♦నవ్వుటకును
దెప్పువారికి సందయ్యె♦దెప్పుటకును
దగదు నీ కింక నిటు నిద్ర♦దవిలి యుంట
మేలుకొను మాంధ్ర వీరుఁడ! ♦ మేలుకొనుము.
ఇపుడు చేయంగ వలసిన♦దెంతో గలదు
సాధనము లెన్నో యున్నవి♦పట్టుటకును

నాళ దివ్య పథంబులు చాలఁ గలవు
ఆది వీరుల య్యంశ నీయందుఁ గలదు
నీకొఱకు వేచి యున్నది నీదు జాతి
ఆంధ్ర జాతీయ నిర్మాణ మాదరమునఁ
బేర్మి మీఱఁగ నీవె కావింప వలయు
దైవ సంకల్ప మిది నీకుఁ దప్పదనుచుఁ
గడఁగి కీర్తించు చున్నది గగనవాణి
ఉఱక కాలమ్ము పరువెత్తు చున్న దకట!
ధర గతించిన కాలంబు తిరిగి రాదు
గడియ కెంతెంతొ నష్టంబు గలుగుచుండెఁ
జర్చ సేయఁగఁ దనువు శాశ్వతము గాదు
పౌరుషము లేని బ్రతు కొక్క బ్రతుకు గాదు!
ఎందఱో యున్నవా రెన్న నీ ధరిత్రి
వార లెల్లరు నీవంటి వారు కారు
అల్లవారికి నీకు సామ్యంబు లేదు
వారు నీతోడ వెన్నంటి వచ్చువారు
నీ కెప్పుడు తోడు నీడలై నిలుచు వారు
మించి నీ యాజ్ఞ లెల్లఁ జెల్లించు వారు

ప్రాణములు పోయినను నిన్ను♦వదలఁ బోరు
ఉల్లమున వారు నిను నమ్మి♦యున్న వారు
వింత గాఢ్యాది యీ లోక♦వృత్త మరసి
పలుగతులనున్న ప్రకృతి స్వ♦భావ మెఱిఁగి
నవ్య వీరుల యాందో♦ళనంబుఁ జూచి
ఇతరుల మహోన్నత స్థితి♦యెల్లఁ గాంచి
క్షితినిఁ దలలేని యాత్మ దు♦స్థితికి రోసి
ఆత్మ దేశాభివృద్ధిఁ దా♦మభిలషించి
యత్నమే కార్య సాధన♦మనుచుఁ దెలిసి
సమధికంబగు నూత నో♦త్సాహ మొంది
ఇతరు లొనరించు నిందల♦నెల్ల సైచి
దీక్షమై నీ యనుజ్ఞలఁ♦దెలియఁ గోరి
వృద్ధి గాంచుట యింకెప్పు♦డెప్పు డనుచు
నోర్మి. నీ వెప్డు మేల్కొందు♦వో యటంచు
నుత్సవము తోడఁ దటి నేచి♦యున్న వారు
పరులు పూనిన రవ్వంత♦పనియుఁ గాదు
కడిమిమై నీవు పూనినఁ♦గాక పోదు
ఇదియు తగు కాల మీ పని♦కీవు పూన

గాలిసించిన విధ్వంస♦మగును దుఃఖ
అరయ నీకిది కష్ట కా♦ర్యమ్ము గాదు
అమల ధర్మంబు నీకు సా♦యంబు గలదు
ప్రీతి నిన్గోరుచున్నది♦విజయ లక్ష్మి
తగదు నీకిక నిటునిద్రఁ♦గవిలి యుంట
మేలుకొను మాంధ్ర వీరుఁడ! ♦ మేలుకొనుము.



శ్రీ ర స్తు.

# గీ త మం జ

[ప్రథమభాగము.]

## పౌ రు ష ము.

మృదు పదమ్ములతో మెలమెల్ల నడచి
రమ్య గంభీర భావమ్ముప్రకట పఱచి
మహితమతు లబ్బురం పడమా కలమ్ము
దైవ పౌరుష బల తారతమ్య మెంచు.

అద్భుతపు సాధనము లెన్నొయమరుఁగాత
మెండుగా శక్తి యుక్తులునుండుఁ గాత
దైవ మనుకూలుఁడయి దయఁదలఁచుఁ గాతఁ
బౌరుషము లేకయున్న నేపనియుఁ గాదు.
కార్య సిద్ధికి దైవమ్మొకారణమ్ము

పరిగణింపఁగఁ బురుషుని♦పురుషకార
మంతయును వ్యర్థ మని కొంద♦రాడుచుంద్రు
గాని యది యించుకయు నమ్మ♦రాని మాట.
ఈవు యత్నమ్ము సేసితి♦వేని నీదు
కాంక్షితమ్మును నెఱవేర్పఁ♦గాని తలఁప
నీవు యత్నమ్ము నొనరింప♦వేనిఁ దనకుఁ
దా నయి ఫలమ్ము నిడఁబోఁడు ♦ దైవ మెపుడు.
ఏను చేయఁగ వలసిన♦దేమి గలదు?
నారు వోసిన యాతఁడు♦నీరు వోయ
కుండునే యని భావించి♦యూరకున్న
ఫలమునకు నీరు వదలఁగ♦వలసి వచ్చు.
పౌరుషము వీడి కార్య సా♦ఫల్యమునకు
విశ్వవిభు మీఁద భారమ్ము♦వెట్టి సతము
"మనుజ యత్నమ్ము సాగునే"♦యనుచు ముక్కు
మూసికొని యుండు వానిఁ గా♦పురుషుఁ డండ్రు.
సత్యము నెఱింగి యత్నమ్ము♦సల్ప నట్టి
యాతఁ డెంతటి గొప్పవాఁ♦డైనఁ గాని
శక్తి కొలఁదిగ యత్నమ్ము♦సలుపు పేద

వానిచే సైతము జయింపఁ♦బడును సుమ్ము.
నారసమ్ములు నైతిసం♦హారకములె.
జతన మొనరించి విడకున్నఁ♦జంప లేవు
కార్య సిద్ధికి దైవ మ్మె♦కారణమ్ము
పౌరుషము సేయకున్న దై♦వమ్ము వమ్ము.
అరయ నప్రయత్నముఁగ న♦యాచితముగ
నష్టపుడు దైవము ఫలించు♦నైన నద్ది
కాకతాళీయ మగుఁగాని ♦కాదు నిజము
దైవ బలమునకును స్వతం♦త్రత హుళిక్కి.
విశ్వ మెల్ల సృజించెడి♦వేధ గూడ
విశ్వ రక్షకుఁడగు రమా♦విభుఁడు గూడ
విశ్వ సంహర్త యగు నుమా♦విభుఁడు గూడఁ
గనఁగ బ్రహ్మాద్యులై నట్టి♦మునులు గూడఁ
రామ కృష్ణాది కావతా♦రములు గూడఁ
బ్రకట బలుఁడైన తారకాం♦తకుఁడు గూడఁ
బ్రథిత జగదేక ధన్వి మ♦న్మథుఁడు గూడ
నలుఁడు మున్నగు చక్రవ♦ర్తులును గూడఁ
గాళిదా సాదులగు మహా♦కవులు గూడఁ

పరమ దివ్య ప్రభావ సంపద్విశిష్టు
లయ్యు స్వాభీష్ట కార్యమ్ములందు మిగుల
యత్న మొనరించి యే విజయంబు గనిరి.
దేశ హితమును గోరి సుస్థిర మనస్కు-
లై విసువు లేక తమ తమ జీవితములు
ధార వోయుచు మానవోత్తము లటంచు
ఘనతరాముల విఖ్యాతిఁ గాంచుచున్న
నీతి కోవిదులైన మంత్రి ప్రవరులు
యుద్ధమున వైరులను గూల్చి యోధమణులు
విజయ లక్ష్మినిఁ జేకొన్న వీరవరులు
రమ్య గుణసాంద్రులగు బుధరాజమణులు
విశ్వ భూషణులైన కవి ప్రభువులు
ధనము భువి వెదచల్లు వదాన్యవరులు
కార్య శూరులును బరోపకారమతులు
సైన్యనాథులు సదసద్విచారకులు
లనుపమాన బలాఢ్యులు న్యాయమూర్తు
లసమ సంగీత విద్యా రహస్య విదులు
కాలవిజ్ఞులు మున్నుగాఁ గలిగి వట్టి

వార లెల్లను నీ వంటి♦వారె తొలుత.
అయిన నగుఁ గాకఁ బ్రకృతమ్ము♦నందు నీకు
వారికిని మధ్య నెంటి♦వ్యత్యయమ్ము,
కలదొ వారి యున్నతికిని♦గారణమ్ము
నెదియొ? యూహించి నాఁడ వే♦యించు కయిన?
అరయ నిందింతయును రహ♦స్యమ్ము లేదు
అర్భకునకైన నిది తెలి♦యునిది గాదు
నెమ్మదిని వింత పడఁ గార♦ణమ్ము లేదు
సమధికపుఁ జర్చతో నవ♦సరము లేదు
అఖిల లోకాభ్యుదయ హేతు♦వైన యట్టి
పౌరుషమె వారి యౌన్నత్య♦కారణమ్ము.
అగుట నియమములు గలిగిన♦యవసరమున
నెడఁద నీవింతుకయుఁ జలి♦యింపఁ బోక
మించి యడ్డపడ్డ నిన్నడ్డ♦గించు నంత
రాయముల కోడి మది వెను♦దీయఁ బోక
మానస స్థైర్య మింతయు♦లేని వాండ్రు
సేయు సాహాయ్య మీ వపే♦క్షింపఁ బోక
విశ్వ విజ్ఞాన శూన్యులౌ♦వెఱ్ఱి వాండ్రు

సేయు పరిహాసములు లెక్క♦సేయఁబోక
పౌరుషము సేయు వారి నీ♦శ్వరుఁడు మదిని
మరచి పోఁడను విషయమ్ము♦మఱువఁ బోక
యెంత ఘనత వహించిన♦నేమివాసి?
తనువు శాశ్వతమే యంచు♦దలఁపఁ బోక
తను వశాశ్వత మైనను♦ధరణిఁ గొన్ని
కృతు లనంతము లని విస్మ♦రింపఁ బోక
అధికముగ నీదు సాహాయ్య♦మభిలషించు
మహిత సంఘంబు గలదంచు♦మఱవఁ బోక
యెంతఁగో యుండ ఘను లిది♦యేనె చేయ
వలయునే యని మనమున♦దలఁపఁ బోక
అరయఁగా దైవ మాధేయ♦మని యెఱింగి
అవనిఁ బౌరుష మాధార♦మనుచుఁ దెలిసి
నిను జెఱచు చున్న సోమరి♦తనము విడిచి
మొట్ట మొదట ననాథత్వ♦మును ద్యజించి
సమధికంబుగ మది సాహ♦సంబు దాల్చి
అలసు లైన యొక్కవోని ధై♦ర్యము వహించి
తొలుత సాధక బాధకం♦ముల నెఱింగి

గురుతరాత్మ గౌరవమును♦గుఱుతెఱింగి
దృఢతరానన్యభంగమైన♦దీక్ష దాల్చి
గెలిచి తీరెదనని పట్టు♦గల వహించి
మనుజున కసాధ్య మెదియు లే♦దని గ్రహించి
చలము మీఱ నాహార స♦త్రలను మాని
అంతరమున ఫలాఫలా♦వాప్తి మఱచి
మంచి చెడ్డల మఱి మఱి♦యెంచి యెంచి
విశ్వ నాథుని మానస♦వీథిఁ గొలిచి
పౌరుష మ్మొనరింపుచుఁ!♦భ్రాతృవర్య!.
కందు లేని వివేకమ్ము♦గాంచి తేని
సాటి లేనట్టి యభిమాన♦శాలి వేని
స్వజన సౌఖ్యమ్ము గోరెడి♦వాఁడ వేని
మహిత మతిఁ గన్న దేశాభి♦మాని వేనిఁ
జిత్త సీమను గల్మిఁ గాం♦క్షించె దేని
గురుతర మ్మైన సుఖమును♦గోరి తేనిఁ
బ్రకృతి ధర్మమ్ము నెఱిఁగిన♦వాఁడ వేనిఁ
బౌరుష మ్మొనరింపుమా!♦భ్రాతృవర్యా!-

శ్రీ

# కళాభివర్ధనీగ్రంథమాల.

౧౯౦౯లో స్థాపితము.



ఇందు నవలలు, దేశ చరిత్రములు, మహా పురుషుల జీవితములు రాబోవు పరిపూర్ణమునకు జక్కని కాలికో బైండు చేయించి ప్రకటింపఁబడును.

ఈగ్రంథమాలలోఁ బ్రకటించిన గ్రంథముల నన్నింటిని గొనుచు నిఁక ముందు ప్రకటింపఁ బోవు గ్రంథముల నన్నింటిని గొనుటకు నొప్పుకొను వారు శాశ్వతపు చందాదారులు.

శాశ్వతపు చందాదారులకు నీగ్రంథమాలలోని గ్రంథములన్నియును వంచెకూలి మేమే భరించి నూరు పుటలకు ౦-౫-౦ చొప్పున నిచ్చెదము. ఇతరులకు నీ పుస్తకములు అంచె కూలి గాక నూరు పుటలకు ౦-౧౦-౦ చొప్పున నీయఁబడును.

అనుబంధ గ్రంథములను చందాదారులకు ఉచితముగ నిచ్చెదము

శాశ్వతపు చందాదారులు సొమ్ము ముందు నీయ నక్కఱలేదు. ఒక్కొక్క పుస్తకము చొప్పు ముగియఁగనే అది వ్యాల్యూపేబిలు ద్వారా పంపఁబడును.

చందాదారులు ప్రవేశ రుసుము క్రింద ౦-౪-౦ చెల్లింపవలెను. ప్రవేశరుసుము తమ దరఖాస్తుతోఁ బంపవచ్చును. లేదా మొదట బంపు వి.పి.లోఁ జేర్చ బట్టుకొనఁబడును.

ఇదివఱలోఁ బ్రకటింపఁబడిన గ్రంథములు దక్కఁ నిఁక దే పిమ్మలోఁ బ్రకటింపఁబడవు.

మాగ్రంథమాలకు ౧౦ మంది చందాదార్లను చేర్చు వారికి నిదివఱలోఁ బ్రకటించిన గ్రంథములను నూరిక యిచ్చెదము.

## ఇదివఱలోఁ బ్రకటించిన గ్రంథములు.

## వారకాంత. (నాటకము.) ౦-౪-౦

ఇందు వేశ్యల ఆచారములు, ఆలోచనములు, మాయలుమున్నగునవి చక్కఁగఁ బ్రదర్శింపఁ బడినవి.

## రామదేవవిజయము. ౦-౬-౦

ఇదియొక నాటకము. రెడ్డిచరిత్ర. కథాకల్పనమత్యద్భుతము. రెడ్డిసంభాషణము విని తీరవలెను. వీరరసపరిపూరితము. రెడ్డి శౌర్య మిందుఁ జక్కఁగఁ బ్రదర్శింపఁ బడినది.

## సాహసికరాజపుత్త్రిము. ౦-౬-౦

ఇది చరిత్రవిషయిక నాటకము. ఉదయపుర రాణామీఁదికక్బరు దండెత్తి వచ్చుట. రాణీ యగు రామాబాయి అక్బరుని యుద్ధమునకుఁ బిలిచినప్పుడు చదివినపద్యములెల్ల వినితీరవలయును.

## పాణిగృహీతాశ్రవణానందశృంఖల ౦-౬-౦

ఇది తిరుపతి వేంకటకవుల పాణిగృహీతకును శ్రవణానం

దియునవను విమర్శనగ్రంథము. నిష్పక్షపాతముగ వ్రాయఁబడి నది. అనేక విధదోషము లిందు ఖండింపఁబడినవి. ఇది విద్యార్థులకు నిర్దుష్టాంధ్రసాహిత్యమును, కవులకు నిర్దుష్టమును సరసము నగు మృదుశైలిని, పండితుల కపారామోదమును గలిగించును. ప్రతి దినమును పెక్కు దరఖాస్తులు వచ్చుచున్నవి. మించిన దొరకదు.

## గీతమంజరి ౦-౨-౦

ఇత్యాది వివిధ విషయిక మనోహర గీతపద్య మాలికలచే విరాజిల్లుచున్నది. చదువరుల హృదయ కమలములను వికసింపఁజేసి జాతీయ భావమును గలిగించును.

చందా దారుల సూచికము.

మా చందాదారులకు అంచె కూలితోఁ బైగ్రంథములు ౧-౨-౦.

ఇతరుల కంచె కూలితో ౧-౧౧-౦.

రాఁబోవు గ్రంథము.

## మిథునానురాగము.

ఇది యత్యద్భుత మగు చరిత్ర విషయిక నవల. రంగులపటము లుండును. చక్కని కాలికో బైండు. చదువ నారంభించినఁ దుద ముట్టు వఱకు విడువరు. అన్ని విధముల బంకించంద్రుని గ్రంథములతో సరితూఁగును.

తయారగు చున్న గ్రంథములు.

ఇంగ్లాండు దేశచరిత్రము, భూగోళ శాస్త్రము.

మా కార్యస్థానమున వెలకు దొరకునితరగ్రంథములు.

౧. మోహలేఖ. ... ... ... ... ౦ ౧ ౬

ఒక కాముకుండొక ముగ్ధ కంపిన ముద్దు గొలుకు మోహలేఖ.

౨. జలక్రీడ. ... ... ... ... ౦ ౦ ౬

ఎనమండ్రు భార్యలతో శ్రీకృష్ణుడు జలక్రీడ సేయుట.

౩. ఆంధ్ర నామ సంగ్రహము. ... ౦ ౪ ౦

శుద్ధప్రతి. చక్కని కాగితములు. పుటలు ౮౦.

చౌక! **అప్రస్తుత ప్రశంస.** చౌక!

వెల రు౦-౪-౦. నెలవఱకు రు౦—౧—౦మాత్రమే.

ఇది రామకృష్ణ కవులకును తిరుపతి వేంకట కవులకును జరిగిన కలహ వృత్తాంతమును దెలుపు చక్కని గ్రంథము. మంచి పద్యము లున్నవి. సులభ శైలి.

వలయువారు,—

మానేజరు, కలాభివర్ధని,

రాయవరము, కోట రామచంద్రపురం పోష్టు,

గోదావరి జిల్లా.

(అని వ్రాయవలెను)

# ప్రకటన.







